# కుమారీశతకము

ఇది

పక్కి వేంకట నారసింహాకవి ప్రణీతము



లలితా అండ్ కో.,
విద్యావిషయిక ప్రచారకులు,
తెనాలి – ఏలూరు.

1946

 [వెల ౧ అణా.

శ్రీరస్తు.

# కుమారీశతకము

శ్రీ భూ నీళా హైమవ
తీ భారతు లతులశుభవ ♦ తిగ నెన్నుచు న
త్సౌభాగ్యము నీ కొసఁగఁగ
లో భావించెదరు ధర్మ ♦ లోల కుమారీ. 1

క. చెప్పెడి బుద్ధులలోపలఁ
దప్పకు మొకటైన సర్వ ♦ ధర్మములందున్
మెప్పొంది యిహపరంబులఁ
దప్పింతయు లేక మెలఁగఁ ♦ దగును కుమారీ. 2

క. ఆటల బాటలలో నే
మాటయు రాకుండఁ దండ్రి ♦ మందిరమందున్
బాటిల్లు కాఁపురములో
వాట మెఱిఁగి బాల తిరుగ ♦ వలయు కుమారీ. 3

క. మగనికి నత్తకు మామకుఁ
దగసేవ యొనర్చుచోటఁ ♦ దత్పరిచర్యన్
మిగుల నుతిఁ బొందుచుండుట
మగువలకుం బాడి తెలిసి ♦ మసలు కుమారీ. 4

క. పెనిమిటి వలదని చెప్పిన
పని యెన్నఁడు జేయరాదు ♦ బావల కెదుటన్
గనఁబడఁగ రాదు కోపము
మనమున నిడుకొనక యెపుడు ♦ మసలు కుమారీ. 5

క. పరపురుషు లన్నదమ్ములు
వరుఁడే దైవంబు తోడి ♦ పడుచులు వదినెల్
మఱఁదండ్రు నత్తమామలు
ధరఁ దల్లియుఁ దండ్రియనియుఁ ♦ దలఁపు కుమారీ. 6

క. పదములపైఁ జెయి వేయక
మదవతి పతిచెంత నిద్ర ♦ మరిగినఁ జేతుల్
గదలంగనీక కట్టుచు
గదఁగొని శిక్షించు యముడు ♦ కాంక్షఁ గుమారీ. 7

క. తెచ్చినఁ దేకుండిన నీ
కిచ్చిన నీకున్న మగని ♦ నెగ్గాడకుమీ
యొచ్చము నీపైఁ దేలును
రచ్చల కామాట లెక్క ♦ రవ్వకుమారీ. 8

క. మఱఁదండ్రు వదిన లత్తలు
మఱఁదులు బావలకుమాళ్లు ♦ మఱి పెద్దలు రా
నురవడిఁ బీటలు మంచము
లరుఁగులు దిగుచుండవలయు ♦ నమ్మకుమారీ. 9

క. నోరెత్తి మాట లాడకు
మాటాడకుఁ గోపబడిన ♦ మర్యాదలలో
గోరంత తప్పి తిరుగకు
మీఱకుమీ యత్తపనుల ♦ మెలగుకుమారీ. 10

క. పతి పరకాంతలతో సం
గతిఁ జేసిన నాదుపుణ్యా ♦ గతి యిట్లనుచున్
మతిఁ దలఁపవలయుఁ లేదా
బతిమాలఁగవలయుఁ గలహ ♦ పడక కుమారీ. 11

క. పతిపాపపుఁబని జెప్పిన
బతిమాలి మరల్చవలయు ♦ బతి వినకున్నన్
హిత మనుచు నాచరింపుము
మతిలోపల సంశయంబు ♦ మానికుమారీ. 12

క. తిట్టినఁ దిట్టక కొట్టిన
గొట్టక కోపించెనేనిఁ ♦ గోపింపక నీ
పుట్టిన యింటికి బాదము
మెట్టినయింటికిని వన్నె ♦ వెట్టుకుమారీ. 13

క. దబ్బఱ లాడకు గదిమిన
బొబ్బలు వెట్టకుము మంచి ♦ బుద్ధికలిగి యెం
దెబ్బెఱికముఁ బూనక కడుఁ
గొబ్బునఁ జిత్తమున వానిఁ ♦ గూర్చు కుమారీ. 14

క. పతి భుజియించిన పాత్రను
మెతు కొక్కటియైన భార్య ♦ మెసఁగుటకై తా
హితమూనకున్న నది యొక
సతియే కడుఁ బాపజాతి ♦ జగతి కుమారీ. 15

క. జపములు గంగాయాత్రలు
దపములు నోములును దాన ♦ ధర్మంబులు పు
ణ్యపురాణము పతిభక్తికి
నుపమింపను సాటి రాక ♦ యుండుఁ గుమారీ. 16

క. ఇరుగు పొరుగిండ్లకైనను
వరుఁడో కాక త్తగారో ♦ వదినెయొ మామో
మఱఁదియొ సెలవిడకుండఁగఁ
దరుణి స్వతంత్రించి పోవ ♦ దగదు కుమారీ. 17

క. కూతురు చెడుగై యుండిన
మాతది తప్పన్నమాట ♦ మది నెఱుఁగుదుగా
నీ తలిదండ్రులకు నప
ఖ్యాతులు రానీయఁగూడ ♦ దమ్మ కుమారీ. 18

క. అమ్మకు రెండబ్బకు రెం
డిమ్మహిఁ దిట్టించు కూతు ♦ రెందుకు ధర నా
గ్రిమ్మరి పుట్టక పోయిన
నిమ్మళమని యండ్రు జనులు ♦ నిజము కుమారీ. 19

క. తన బావల పిల్లలయెడఁ
దనమఱఁదుల పిల్లలందుఁ ♦ దనపిల్లల కం
టెను మక్కువ యుండవలెన్
వనితల కటులైన వన్నె ♦ వచ్చు గుమారీ. 20

క. ధనహీనుఁడైన గడు దు
ర్జనుడైన గురూపియైన ♦ జారుండైనన్
విను పాపియైన నెప్పుడుఁ
దన పతియే దనకు దైవ ♦ తంబు కుమారీ. 21

క. ధనవంతుఁడైన యప్పుడు
పెనిమిటి చిత్తంబెఱింగి ♦ పెండ్లాము మెలం
గును లేమి మెలఁగ నేర్చిన
వనితకు లోకమున వన్నె ♦ వచ్చుఁ గుమారీ. 22

క. తలిదండ్రు లన్నదమ్ములు
తులఁదూఁగఁగ నిమ్ము పసిడి ♦ తోనైనను వా
రలయింట సతతముండుట
వెలదికి మర్యాదగాదు ♦ వినవె కుమారీ. 23

క. కడుపారఁ గూడుఁ గూరలు
దొడవులు వస్త్రములు మిగుల ♦ దొరకవనుచుఁ దా
వడితనమునఁ బెనిమిటితో
నెడఁ బాసి చరింపఁగూడ ♦ దెప్పుడు కుమారీ. 24

క. పిల్లలఁ గనుగొనఁ దలచిన
యిల్లాలు గతాగతంబు ♦ లెఱుఁగకతాఁగై
యల్లరిఁ బెట్టినఁ జెడుఁదా
నుల్లసములఁ బడును గీడు ♦ నొందు కుమారీ. 25

క. పతి కర్తకు మామకు స
మ్మతిగాని ప్రయోజనంబు ♦ మానఁగవలయున్
హిత మాచరించ వలయును
బ్రతుకున కొకవంక లేక ♦ పరఁగు కుమారీ. 26

క. పోకిళ్ళు పోక పొందిక
నాకులలోఁ బిందెరీతి ♦ నడఁకువగా నెం
తో కలసి మెలసి యుండిన
లోకము లోపలను దావె ♦ లుంగుఁ గుమారీ. 27

క. అత్తపయిన్ మఱఁదలిపయిఁ
నెత్తినకోపమున బిడ్డ ♦ నేడ్పించుటకై
మొత్తిన తనకే కీడగు
చిత్తములో దీనిఁ జింత ♦ సేయు కుమారీ. 28

క. మృతియైనను బ్రతుకైనం
బతితోడనె సతికిఁ జెల్లు ♦ బతి బాసిన యా
బ్రతు కొకబ్రతుకా జీవ
న్మృతికాక వధూటి కెన్న ♦ నిదియుఁగుమారీ. 29

క. మగనిప్రియు మబ్బె ననుచును
దెగనీలిగి యింటివారి ♦ దిగఁ ద్రొక్కుచు దుం
డగురాలై తిరిగిన సరి
మగువలలో నిదియె తప్పు ♦ మాట కుమారీ. 30

క. జీవములు భర్తపదరా
జీవములని చిత్తమందుఁ ♦ జింతించిన ల
క్ష్మీవల్లభు చరణంబుల
సేవ లతాంగులకు నెమ్మిఁ ♦ జేయుఁ గుమారీ. 31

క. కడుబుద్ధి గల్గి మెలఁగిన
పడఁతుక పుట్టింటివారు ♦ పదివేలవరా
లిడుకంటెఁ గీర్తియగు ద
మ్మిడి లేకుండినను నేర్పు ♦ మెలగు కుమారీ. 32

క. కడుఁ బెద్దమాటఁ దెచ్చిన
చెడుగై వర్తించునేనిఁ ♦ జిరతరచింతం
బడుదురు తలిదండ్రుల తోఁ
బడుచులు సోదరులు నిందఁ ♦ బడుచుఁ గుమారీ. 33

క. పుట్టింటివారి నీచతఁ
బెట్టకు మత్తింటివారు ♦ పెట్టెడు బాధల్
పుట్టింటఁ దెలియనీయకు
రట్టడి చెలి యందు రదియె ♦ రవ్వ కుమారీ. 34

క. తన కెంత మేలుజేసిన
మనమున కింపైన పనులు ♦ మసలిన దాసీ
వనితల కెన్నటికైనం
జనువిచ్చి మెలంగరాదు ♦ జగతిఁ గుమారీ. 35

క. కులదేవతలకుఁ బెట్టిన
పొలుపునఁ దనయింటియాఁడు ♦ బొట్టెలకెల్లం
గలమాత్ర మొసఁగకుండినఁ
గలఁత వొడము దాన మేలు ♦ గాదు కుమారీ. 36

క. బద్ధకము సంజనిద్దుర
వద్దుసుమీ పేదఱికము ♦ వచ్చును దానన్
గద్దింతు రింటివారలు
మొద్దందురు తోటివారు ♦ ముద్దుకుమారీ. 37

క. ఇంటఁగలగుట్టు నీపొరు
గింట రవంతైనఁ దెలుప ♦ నేగకు దానం
గంటసపడి నీవారలు
గెంటించెద రిల్లువెడలఁ ♦ గినుకఁ గుమారీ. 38

క. వేకువజామున మేల్కాని
పైకి వెడలివచ్చి ప్రాచి ♦ పనిఁ దీర్పవలెన్
లేకున్నఁ దెల్లవాఱిన
లోకులు నవ్వుదురు సభల ♦ లోనఁ గుమారీ. 39

క. ఇక్కడి దక్కడ నక్కడి
దిక్కడఁ జెప్పినను ♦ వారికిద్దఱికిఁ బగల్
పొక్కనఁగల చేడియ ల
మ్మక్కా యిదుమళ్ళమారి ♦ యండ్రు కుమారీ. 40

క. తలవాకిట నెల్లప్పుడు
నిలువఁగరా దెప్పుడెంత ♦ నిద్దురయైనన్
మెలఁకువ విడరాదు సుమీ
తల నదుచుచు విప్పికొనుట ♦ తగదు కుమారీ. 41

క. వారికి వీరికిఁ గలిగెను
గోరిన వస్తువులు మాకు ♦ గొదవాయె నటం
చూరక గుటకలు మ్రింగుట
నేరముగాఁ దలఁపవలయు ♦ నెలఁత కుమారీ. 42

క. కొన్నాళ్ళు సుఖము కష్టము
కొన్నాళ్ళు భుజింపకున్నఁ ♦ గొఱగాదుసుమీ
పున్నమ దినముల వెన్నెల
యెన్నఁగ నమవసలయందు ♦ నిరులు కుమారీ. 43

క. పొంతఁ బనిసేయు కెన్నఁడు
వంతంబులు పలుక ♦ బోకు ప్రాఙ్ముఖముగ నీ
దంతంబులు దోమకు మే
కాంతంబులు బయలుపఱుప ♦ కమ్మ కుమారీ. 44

క. నడకలలో నడుగుల చ
ప్పుడు వినఁబడకుండవలయు ♦ భువి గుంటలు క
న్పడరాదు మదమనోక్కులఁ
బడతుఁలమర్యాద లెటిఁగి ♦ బ్రతుకు కుమారీ. 45

క. నవ్వంగరాదు పలుమరు
నవ్వినఁ జిఱునవ్వుగాని ♦ నగరా దేపుడున్
గవ్వలవలె దంతంబులు
జవ్వనఁగానంగ బడెడి ♦ జూడఁ గుమారీ. 46

క. తొడవులు మిక్కిలి గలిగినఁ
గడుఁ బ్రేమన్ మగఁడు మిగులఁ ♦ గారామిడినన్
బడతుక పసుపుం గుంకుమ
గడియైనను విడువరాదు ♦ కాదె కుమారీ. 47

క. చెడుగులతో లంజలతో
గుడిసేటులతోడఁ బొత్తు ♦ కూడదు మది నె
ప్పుడు నిల నుత్తమకాంతల
యడుగులకు న్మడుగులొత్తు ♦ మమ్మకుమారీ. 48

క. వినువకు పని తగిలినయెడఁ
గసరకు సేవకుల మిగులఁ ♦ గాంతునితోడన్
రొసరొన పూనకు మాడకు
మసత్య వచనంబులెన్నఁ ♦ డైనఁగుమారీ. 49

క. వేళాకోళంబులు గ
య్యాళితనంబులును జగడ ♦ మాడుటలును గం
గాళీపోకలు కొండెము
లాలోచించుటయుఁ గూడ ♦ దమ్మ కుమారీ. 50

క. బంతులను బక్షపాత మొ
కింతైనను జేయరాదు ♦ హీనదశల సా
మంతుల నొకభంగి నిరీ
క్షింతురు బుధులెల్ల సంత ♦ సిల్లఁ గుమారీ. 51

క. మాసినతల మాసినయిలు
మాసినవలువలు దరిద్ర ♦ మార్గంబులు నెం
తేసి ధనవంతులైనను
గాసిల్లుదు రల్పదశలఁ ♦ గ్రాఁగి కుమారీ. 52

క. సన్నికలుం బొత్రమ్మును
తన్నకపోరాదు కాలఁ ♦ దగిలినయెడలన్
గన్నుల నద్దుకొనన్వలె
గ్రన్నన సిరియందు నిలుచుఁ ♦ గానఁ గుమారీ. 53

క. దీపము వెలిగించెడిచోఁ
జీపురుపుడ కుంపవలయుఁ ♦ జేతుల సేతం
బాపము పాతౌదువు మది
లోపల నిది తలఁపవలయు ♦ మాధిఁ గుమారీ. 54

క. సరకులయెడ జాగ్రత్తయుఁ
జాఱుకు పనులయందు భక్తి ♦ సుజనులయందుర్
గరుణ యనాథుల యెడలం
దరుణికిఁ జెలువారవలయు ♦ ధరణిఁ కుమారీ. 55

క. చెప్పినఁ జెప్పక యుండిన
దప్పక సేయంగవలయుఁ ♦ దనపనులెల్లన్
మెప్పొదవఁగాను లేదా
ముప్పొదవును గాదె యెందు ♦ ముద్దుకుమారీ. 56

క. మొంగిలి పరులకుఁ బెట్టకు
క్రంగున ప్రేమాయంగ నీకు ♦ కాల్మెట్టియలన్
బంగారులాభ ముండిన
దొంగతనము సేయు బుద్ధిఁ ♦ దొలఁచు గుమారీ. 57

క. ఆపదల కోర్చి సంపద
లాపయి భోగించు ననెడి ♦ హార్షోక్తుల నీ
లోపలఁ దలఁచుచు లాంతరు
దీపముచందమున వెలుగఁ ♦ దివురు కుమారీ. 58

క. తనకడుపు కట్టుకొని యై
నను జుట్టమునకును బెట్టి ♦ నను గీర్తినహిం
చును భుక్తిముక్తులబ్బును
దన కెవ్వరు సాటిరారు ♦ ధరణి కుమారీ. 59

క. వడిదనిపించుకొనుట కొక
గడి యైనను పట్టకుండుఁ ♦ గాంతలలో నె
క్కుడు గుణవతి యనిపించెడి
నడవడి నేర్చుటయె కడు ఘ ♦ నంబు కుమారీ. 60

క. చెప్పకు చేసిన మేలు నొ
కప్పుడయినఁ గాని దాని ♦ హర్షింపరుగా
గొప్పలు చెప్పిన నదియును
దప్పేయని చిత్తమందు ♦ దలఁపు కుమారీ. 61

క. ఎంతటి యాకలి కలిగిన
బంతిని గూర్చుండి ముందు ♦ భక్షింపకు సా
మంతులు బంధువులును నిను
మంతైనను జెల్లదందు ♦ రమ్మ కుమారీ. 62

క. అధికారము లేనిపనుల
కధికారము సేయబోకు ♦ ముందునఁ గోపం
బధికంబగు నీవారికి
బుధు లది విని హర్షమొందఁ ♦ బోరు కుమారీ. 63

క. తా నమ్ముదువడియైనం
దీనుండగు ధవునియార్తిఁ ♦ దీర్చుట సతికిన్
మానము చంద్రమతీ జల
జాననఁ దలపోయవలయు ♦ నాత్మఁ గుమారీ. 64

క. తనకంటెఁ బేదరాండ్రం
గని యంతకుఁ దనకు మేలు ♦ గా యనవలయున్
దనకంటె భాగ్యవంతుల
గని గుటకలు మ్రింగ మేలు ♦ గాదు కుమారీ. 65

క. విఱుగఁబడి నడువఁగూడదు
పరులనడకలెన్ని తప్పు ♦ బట్టఁజనదు ని
ష్ఠురములు వచింపఁగూడదు
కఱపఁగవలె మేలు మేలు ♦ గలదు కుమారీ. 66

క. కోపమున నప్పు డాడ ని
రూపించినమాట గొన్ని ♦ రోజులు చనినం
జూపెట్టుదు రని శాంతము
లోపలఁ గొనవలయు ధర్మ ♦ లోల కుమారీ. 67

క. కలహపడునింట నిలువదు
కలుముల జవరాలు కాన ♦ కలకాలం బే
కలహములు లేక సమ్మతి
మెలఁగంగా నేర్చునేని ♦ మేలు కుమారీ. 68

క. గురుశుక్రవారముల మం
దిరగేహళులందు లక్ష్మి ♦ తిరముగనిలుచుం
గరగరిక నలికి ముగ్గిడి
గురుభక్తి మెలంగఁ బాయుఁ ♦ గొదువ కుమారీ. 69

క. అపకీర్తిం బొందుట క
ష్టపుఁబని గా దొక్కగడియ ♦ చాలును గీర్తి
నిపుణత వహింపవలయును
జపలగుణములెల్లఁ బాసి ♦ చనఁగఁ గుమారీ. 70

క. సరకులు బట్టలు వన్నెల
కెరువులు తేఁదగదు తెచ్చె ♦ నేని సరకు ల
క్కఱదీర్చుకొనుచు వెంటనె
మరలింపకయున్నఁ దప్పు ♦ మాట కుమారీ. 71

---

గేహళులు=గడపలు ; గరగరిక=నైర్మల్యము.

క. గొప్పదశ వచ్చెననుచు నొ
కప్పుడయిన గర్వపడకు ♦ మది దొలఁగినచో,
జప్పట్లు చరతు రందఱుఁ
దప్పని దండించు దండ ♦ ధరుడు కుమారీ. 72

క. సుమతియును జంద్రమతియును
దమయంతియు జానకియును ♦ ద్రౌపదియును బ
న్నములం బడి పతిభక్తిం
గ్రమమున నడుపుటలు తలఁప ♦ రాదె కుమారీ. 73

క. "సుమతి" యను రమణి పతికై
శ్రమనొందుట నీచసేవ నలు ♦ పుటయు వియ
ద్గమననిరోధము భానున
కమరించుటయుం దలంపు ♦ మాత్మఁ గుమారీ. 74

క. వాణియు శర్వాణియు హరి
రాణియు వాక్కునను మైను ♦ రంబున నుంటల్
రాణఁ దిలకించి మదిలో
బాణిగ్రాహిాయెడ నిల్పు ♦ భక్తిఁగుమారీ. 75

క. వడ్డించునపుడు తాఁ గను
బిడ్డనికిందల్లిభంగిఁ ♦ బ్రేమదలిర్పన్
వడ్డింపవలయు భర్తకు
నెడ్డతనము మానవలయు ♦ నెందుఁ గుమారీ. 76

క. పవళించునపుడు రంభా
కువలయదళనేత్రభంగి ♦ గోరినరీతిన్
ధవుని కొనగూర్పవలయును
దివి భువి నుతిఁ బొందు నట్టి ♦ తెఱవ కుమారీ. 77

క. ఆలోచన యొనరించెడి
వేళలలో మంత్రిభంగి ♦ వివరింపవలెం
గాలోచిత కృత్యంబుల
భూలోకమునందుఁ గీర్తి ♦ బొందుకుమారీ. 78

క. పని సేయునపుడు దాసీ
వనితవిధంబునను మేను ♦ వంపగవలయున్
ధనవంతులసుత యైనను
ఘనత గలుగు దానివలనఁ ♦ గాదెకుమారీ. 79

క. దానములు ధర్మకార్యము
లూనంగాఁ గలిగినంత ♦ యుక్తక్రియలన్
మానవతుల కిది ధర్మము
గా నెఱిఁగి యొనర్పవలయుఁ ♦ గాదెకుమారీ. 80

క. శ్రమ యెంత సంభవించిన
క్షమ మఱువగ రాదు ధరణి ♦ చందంబున స
త్యమునఁ బ్రవర్తించిన యా
రమణియె లోకంబునందు ♦ రమణి కుమారీ. 81

క. ఈరీతిఁ దిరుగనేర్చిన
నారీమణి కీర్తిఁబొందు ♦ నరలోకమునం
దూఱులు దొలంగిపోవును
ఘోరదురితసంఘమెల్ల ♦ గుందుఁ గుమారీ. 82

క. కామము సంకల్పంబున
బామొందెడుఁ దొలఁగు దేహ ♦ భావము దెలియన్
వేమఱు నిది పరికించుట
క్షేమం బగు ముక్తిఁగని సు ♦ ఖింపు కుమారీ. 83

క. పరజనము లాచరించెడి
దురితంబునఁ గ్రోధగుణము ♦ దోఁచెడి నధిక
స్ఫురణన్ క్షమఁ గైకొనినం
దఱుఁగు నది యెఱింగి మెలఁగ ♦ దగును గుమారీ. 84

క. దృశ్యపదార్థము లెల్లను
వశ్యము లన తలఁపకుండి ♦ ననులోపంబౌ
దృశ్యంబున నస్థిరత న
వశ్యము చిత్తమున దలప ♦ వలదె కుమారీ. 85

క. జనియించెదు నజ్ఞానం
బున మోహగుణంబు ధర్మ ♦ మునఁ బరికింపం
దనుమాడఁబడును దీనిం
గనుఁగొని మెలఁగంగ వలయు ♦ గాదె కుమారీ. 86

క. కులమున విత్తంబున వి
ద్యలను మదం బుద్భవించు ♦ నాయాపెంపుల్
తలపోయుమరలు నిది హృ
జ్జలజంబునఁ దలపవలయు ♦ సతము గుమారీ. 87

క. మాత్సర్య మొదవు సత్యము
హృత్సరసీజమున లేమి ♦ నెల్లప్పుడుఁ దా
సత్సేవయందుఁ దిరిగిన
మాత్సర్య మణంగుఁ దెలిసి ♦ మనుము కుమారీ. 88

క. బహుకష్టములం బొందక
మహిలో సమకూడఁబోదు ♦ మానవజన్మం
బహహా యీ జన్మంబున
నిహపరములఁ గొనెదుజాడ ♦ లెఱుఁగు కుమారీ. 89

క. ఎన్నాళ్ళు బ్రతుకఁబోదురు
కొన్నాళ్ళకు మరణదశలఁ ♦ గ్రుంగుట జగమం
దున్నట్టివారి కందఱి
కి న్నిహితము సతము మంచి ♦ కీర్తి కుమారీ. 90

క. పెనిమిటికన్నఁ బతివ్రత
మును పే మృతిఁ బొందెనేని ♦ బురుషాగమనం
బున కెదురుచూచు వచ్చినఁ
గనుఁగొని యనురాగ మెనయఁ ♦ గలయుఁ గుమారీ.

క. మును నాథుఁడు దరలినచో
వెనువెంటనెపోయి యెల్ల ♦ వేల్పులు బొగడం
గని పొందు నిందు నందును
ఘనకీర్తులఁ బొందుచుండుఁ ♦ గాదె కుమారీ. 92

క. మఱవవలెఁ గీడు నెన్నఁడు
మఱవంగా రాదు మేలు ♦ మర్యాదలతోఁ
దిరుగవలె సర్వజనముల
దరిఁ బ్రేమ మెలంగవలయుఁ ♦ ధరణి కుమారీ. 93

క. ఆకు లొసంగినఁ జేకొని
పోఁక నమలి సున్నమడుగఁ ♦ బోయినఁ గని యీ
లోకులు నవ్వుదురు సుమీ
కైకొనవలె మంచినడత ♦ ఘనత కుమారీ. 94

క. నేలన్ వ్రాసిన పత్రము
లోలిం జోడించి మడుచు ♦ చుండిన యువియున్
బోఁలగ సున్నపుటాకులు
దూలించు దరిద్రదశలఁ ♦ దోఁగఁ గుమారీ. 95

క. ఇద్దఱు గూడుక యొకచో
నొద్దిక మాటాడుచుండ ♦ నొదిఁగి యొదిఁగి యా
యొద్దకుఁ జనఁగూడదు తన
పెద్దతనం బెల్ల నణఁగఁ ♦ బెట్టుఁ గుమారీ. 96

క. తుడుపు దుమారమ్మును జెరు
గుడుధూళియు మేవరజముఁ ♦ గూడ దెపుడు మైఁ
బడఁ నెఱిఁగి తిరుగ నేర్చిన
బడఁతుక మర్యాద లెఱిఁగి ♦ బ్రతుకు గుమారీ. 97

క. దీపములనీడ మానవ
రూపంబులనీడ శని త ♦ రులనీడ సుఖ
ట్వాపాదిత మగునీడల
నేపట్టున నిలువఁగూడ ♦ దెపుడుఁ గుమారీ. 98

క. కొనగోళ్ళ వ్రేలు వెంట్రుక
లను జాఱెడు నీళ్లు కుండ ♦ లఁ ముంతల వా
డిన వెనుక మిగులు నీళ్లును
జనదంట్రు దరిద్ర మొంద ♦ జగతిఁ గుమారీ. 99

క. ధర బక్కలుకులుఁడు వేంకట
నరసింహ కవీంద్రుఁ డిట్టి ♦ నడతలు ధరపైఁ
దెలివల తెరువు లటంచును
జిరతర సత్కీర్తి వెలయఁ ♦ జెప్పెఁ గుమారీ. 100

సంపూర్ణము.

---